## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120001147

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

బాల విజ్ఞాన కథలు :

# పౌరహక్కులు-విధులు

రచన :

పవన

స్వాతి బుక్ డిస్ట్రిబ్యూటర్స్
విజయవాడ-

# పారహక్కులు-విధులు

అది ఒకమాదిరి పల్లెటూరు. ఆ వూరి పంచాయితీ ప్రెసిడెంటు ధర్మయ్య. ఆ వూరిలో దాదాపు ఒక రెండువందల గృహాలుంటాయ్. ఎలిమెంటరీ పాఠశాల తప్ప హైస్కూలు లేదు. దాదాపు ఆరుమైళ్ళు నడిచిగాని సైకిలుపై గానీ వెళ్ళి విద్యార్థులు విద్యాభ్యాసం చేయాలి.

పల్లెలలో కూడా ధనవంతులు ఏ కొద్దిమందో వేళ్ళపై లెక్కించేవిధంగా వుంటారు. అందువలన పేదరైతుల పిల్లలకు విద్యాభ్యాసము బహుకష్టమనే చెప్పాలి. కనీసం వాన,వంగిడి తట్టుకొని నడిచివెళ్ళి విద్యాభ్యాసము చేయాలనుకున్నా, మోకాటిలోతు బురద, మురుగు అందుకు సహకరించవు. వీటి న్నిటినీ అధిగమించి చదువుకుంటారనుకున్నా కాస్త వారికి లోకజ్ఞానం చెప్పేందుకు అక్కడ విద్యాధికులు చాలాతక్కువ ఒకరిద్దరు వున్నా బహుశా ఆస్థిపరులై వుంటారు. వారి విద్యార్థులకు శ్రద్ధగా ప్రతిదినం పనిచేయవలసిన అవసరం ఏముంటుంది?

వారు పాఠశాలలకు వెళుతుంటారేగాని వారేం చదువుతున్నారో ఉపాధ్యాయులు చెప్పిన విషయాలు వారిమేధస్సుకు ఎంతమటుకు వంటపట్టాయో ఆచూకీ వుండదు ఆచూకీ సేం

దుకు తల్లిదండ్రులు విద్యావిహీనులు కావటమే ముఖ్యంగా దీనికి కారణం, ఇంక వీరికి తెలివితేటలను నిర్ణయించగలిగింది పరీక్షలు. ధనవంతులు తమ తమ పిల్లలకు విద్య అబ్బుతుందా లేదా అన్న ఆలోచనకంటే అంతో ఇంతో లంచము విసిరి వారిని పైక్లాసుకు పంపడమే ధ్యేయముగా పెట్టుకుంటారు. అందుకే నేటి విద్యార్థి సాంఘిక, ఆర్థిక రాజకీయ స్వరూపాలను బొత్తిగా అవగాహన చేసుకోలేని స్థితిలో పట్టభద్రులు కావడం జరుగుతోంది.

ఇంకా ఆర్థికస్థోమతు లేనివారు ఒకక్లాసులో ఉత్తీర్ణులు కాలేకపోగానే ఆ సంవత్సరములో ఆ ఖర్చులూ, ఈ తిప్పలూ భరించలేక చదువుకు స్వస్తిచెప్పి, ఏ కూలికో, పొలం పనిలోనే ప్రవేశించడము ప్రారంభిస్తారు. దానితో వారి జీవితం అవస్థల వలయంలోకి జారటము ఆరంభమవుతుంది. ఈపరిస్థితులన్నీ యధాతధంగా అనుభవిస్తున్న గ్రామాల్లో ఆ గ్రామమూ ఒకటి.

ఆ పరిస్థితులలో నరసింహంగారు ఆ ఊరికి వచ్చారు. ఆయన ఒకప్పుడు బాగా బతికిన మనిషి. ఆర్థికముగా దెబ్బతినటంవలనా అధికసంతానము పెంపకమువలన, బాగా దెబ్బతిన్న మనిషి. అయినా ఎప్పుడూ ముఖముమీద చిరునవ్వు నిష్కపటమయిన హృదయము చక్కని పలకరింపు వీటన్నిటినీ మించి బాగా విద్యాధికుడు కావటము పైగా మంచి లోకానుభవము గలిగిన మనిషి తన భార్య పుట్టినఊరు కావడంతో ఆ ఊరికి వచ్చారు.

5

ఆ పరిస్థితులలో ఆ వూరికి వచ్చిన నరసింహం గార్ని, వారి లోకానుభవాన్ని చూసిన ప్రెసిడెంటు ధర్మయ్యగారికిఒక చక్కని ఆలోచన వచ్చింది మరునాటి ఉదయము వారిద్దరూ ఊరిబయట కాలువ ప్రాంతానికి నడిచి వెళుతున్నారు.

"మాష్టారూ! మీరేమీఅనుకోనంటే ఒకమాట" ధర్మయ్య గారు సందిగ్ధంతో అన్నారు. "చెప్పండి" నరసింహముగారు అదే చిరునవ్వులో ఏదో ప్రత్యేకత కనిపిస్తుంది

"మీకూ ప్రొద్దుపోతూంది. కాస్త పిల్లలూ బుద్ధిమంతులవుతారు. ఏదన్నా ఓ వందరూపాయలొస్తే మీకూ కాస్త సహాయముగా వుంటుందని చెబుతున్నాను మన ఊరినుండి దాదాపు పదిహేనుమంది విద్యార్థులు హైస్కూలు విద్యాభ్యాసము చేస్తున్నారు. కానీ వారికి లోకానుభవము ఏ మాత్రము వంటబట్టటము లేదని నా అభిప్రాయము. ఉపాధ్యాయులకు పాఠాలు చెప్పే సమయమే లేకపోతే ఇంకా మిగిలిన విషయాలు బోధించే సమయము వారికెక్కడ వుంటుంది. నేను వారి తల్లి దండ్రులతో మాట్లాడి మీకు కొంత ఫీజు ఏర్పాటు చేయిస్తాను. ప్రతిరోజు ఒక రెండుగంటలు చక్కగా ఆలయంలో వారికి మంచి విషయాలు బోధన చెయ్యగలరేమోనని.

నరసింహముగారికి ప్రెసిడెంటు ధర్మయ్యగారి మాటలు విన్నాక అదీ బాగానే వుందనిపించింది. తనకు కాలక్షేపంగా వుంటుంది. కాస్త ఆదాయమూ వుంటుంది. గనుక నిశ్చింతగా

కాలము గడుపుకోవచ్చుననిపించి అందుకు అంగీకరించి ఆ మరునాటినుంచీ వారికి పాఠాలు ప్రారంభించాడు.

పిల్లలకు రకరకాల ప్రశ్నలువేసి వారి సామర్థ్యాన్ని అంచనా వేయసాగారు. ఐనా ఏ మనిషయినా ప్రయోజకుడు కావాలంటే ఒక్క తెలివితేటలు చాలవు. ముఖ్యముగా పరిస్థితులు అనుకూలించాలి. అందులో విద్యావిధానములో చాలా మార్పులూ, తెలివిగల పిల్లలకు స్టయిఫండ్సు లాంటివి వుంటే వారిలోని మేధాశక్తికి చురుకుదనానికి దోహదము చేసినట్లవుతుందని ఆయన అభిప్రాయం అలా వుండేది. ఆ పదిహేను మందీ ఒక్కసారిగా వచ్చేవారు. తరగతులకు పనికొచ్చే విషయాలు చెప్పటము ఆరంభించారాయన.

విద్యార్థులకు ఆయన ఆ విషయాలు బోధిస్తుంటే కొందరు ప్రయోజనాలు కూడ ఆయనచుట్టూ మూగి ఆసక్తిగా వింటుండేవారు. ఒరే అబ్బాయిలూ, మనము ఇప్పుడు పౌర ధర్మాలు విధులు అనే విషయాన్ని గురించి చెప్పుకుందాము. అసలు పౌరుడంటే ఏమిటి? మనకు ఈ విషయాలు బోధించే గ్రంథాన్ని పౌరశాస్త్రం (సివిక్స్) అని ఎందుకంటారో తెలుసుకుందాము.

ఈ "సివిక్స్" అనబడే సివిటాస్ (లాటిన్ భాష) అనే పదమునుండి పుట్టింది "సివిటాస్" లేక "సిటీ" అంటే నగరము లేక పురము అని అర్థమున్నమాట. ఈ పట్టణములలోను పురములలోనూ నివసించే వారందరినీ మనము పౌరులంటాము కదా వారికి సంబంధించిన శాస్త్రము గనుక దీనిని

పౌరశాస్త్రం అంటామన్నమాట. ఈ శాస్త్రం ఏమి చెబుతుందో ఆలోచిద్దాము. పౌరుని ధర్మాలూ, అతనికున్న విధులూ అతనికున్న హక్కుల గురించి మనకు చెబుతుందన్నమాట

మన శాస్త్రాలలో అనేక రకాలుంటాయి. అర్థశాస్త్రమనీ, సాంఘిక శాస్త్రమనీ, రాజకీయ శాస్త్రమనీ అనేక రకాలుంటాయి.

అదే విధంగా భౌతిక శాస్త్రమనీ, జంతు శాస్త్రమనీ రసాయన శాస్త్రమనీ, భౌగోళిక శాస్త్రమనీ వైద్యశాస్త్రము అని, ఇంకా వీటిల్లో చాలారకాలున్నాయి. భౌతిక శాస్త్రము వస్తువులు-పదార్థాలయొక్క భౌతికరూపము, అవిజేయు పనుల గురించి వివరిస్తే, జంతుశాస్త్రము జంతువుల గురించి చెబుతుంది. వైద్యశాస్త్రము వైద్య విద్యను గురించి, ఔషధముల ప్రత్యేకతలూ, ఏ రోగానికి ఏ మందు వాడాలో, ఆ రోగ లక్షణాల గురించి చెబుతుందన్నమాట. రసాయనశాస్త్రము రసాయనముల గురించి, వాటి ప్రక్రియలూ, ఇంకా ఇతర ఉపయోగముల గురించి చెబుతుంది. మనకు వీటివలన విషయాలు, వాటి గుణములు తెలిసి నిత్యజీవితములో ఎంతో ఉపకరించేవిగా వుంటాయి.

సరే మనమిప్పుడు పౌరశాస్త్రాన్ని గురించి గదా తెలుసుకోవాలనుకున్నాము-పురము అంటే నగరము ఎక్కువ జనబాహుళ్యముండేచోటు. మనముండేది పల్లె. పట్టణములు అనేవి సామాన్యముగా సముద్రతీరాన వుంటాయన్నమాట.

ఐతే పురము అంటే నగరమని, అక్కడ నివసించేవారిని మాత్రమే పౌరులు అంటారనుకోవడము అవివేకము ఇప్పుడు ఈనాడు కుగ్రామాలుగావున్న వూళ్ళు రేపు మహానగరాలు కావచ్చు, మహానగరముగా వున్నవి శిధిలము కావచ్చు.

"ఎందుకని మాష్టారూ?" ఒక విద్యార్థి ప్రశ్నించాడు.

"అదే చెబుతున్నా దీనికి కారణమేమిటంటే భౌగోళిక అంటే భూమిలోవుండే మార్పులు కావచ్చు. వాతావరణము అంటేఅక్కడి ఉనికి, వాతావరణముగూడా కారణంకావచ్చు. ఉదాహరణకు ఆయా ప్రదేశాలలో భూకంపాలుగానీ, తుఫానులుగానీ అధికముగా ఉధృతముగా వస్తుంటాయనుకోండి. ఎప్పుడు ఏ ఆపద సంభవించి నామరూపాల్లేకుండా నశిస్తుందో చెప్పటము కష్టం దీనికి కొంత సాంఘిక పరిస్థితులు కూడా కారణము, తరచూ మనిషిలోవుండే క్రోధం మూలముగా యుద్ధాలూ, ఈ అణు పయోగాల వలనకూడా ఇలాంటి పమాదాలు జరగవచ్చు."

"మరి పల్లెలు పట్టణాలెట్లా అవుతాయి మాష్టారూ?" ముకుందం అనే విద్యార్థి అదో మాదిరిగా నవ్వుతూ అన్నాడు మాష్టారు చెప్పింది తప్పనిపించినట్లుంది అతని కంఠస్వరము.

"ప్రకృతిలో కొన్ని వనరులున్నాయి. అంటే భూమిలో ఎక్కడ ఏ నిధులు అంటే బంగారమనే కాదు. అంతకన్నా నిత్య జీవితములో మనిషికి అవసరమైనవి అనేకం వున్నాయి. చమురులు, పెట్రోలు, కిరోసిన్, మైకా, ఇనుపరాయి ఇంకా ఇలాంటివెన్నో భూమిలో వున్నాయి. ఐతే పరిశోధనకు

లకు ఇవి ఏ ప్రాంతములో వున్నాయని అనుమానిస్తే అక్కడ త్రవ్వకాలు పారం స్తారు.

సరే అసలు విషయం చెప్పుకుందాం. అక్కడ పౌరులు అంటే మన గ్రామస్తులంతా పౌరులే. ఈ పౌరులలో వుండవలసిన సాంఘిక సామరస్యం, ఒకపౌరుడు మరియొక పౌరునితో వ్యవహరించవలసిన తీరు, తనకు ఇతరులు ఇవ్వవలసిన గౌరవ మర్యాదలూ, తను ఇతరులను ఆదరించి, గౌరవించవలసిన విధానం అంటే విధి, విధి అంటే బాధ్యత అన్నమాట. అట్లాగే ఈ మనిషికున్న హక్కులు, వీటిని గురించి తెలుసుకుందాము.

ప్రతిమనిషికీ ఒకే ధర్మముండదు. మనిషి సంఘజీవి. అంటే తను ఇతరులకు సహకరిస్తూ ఇతరుల సహాయ సంపత్తి అవవరమయితే పొందడమన్న మాట. ఇట్లా కాకుండా ఏ మనిషికామనిషిని స్వతంత్రించి ఇతరులతో పనిలేకుండా బతకటము కష్టము. ఒకవేళ అట్లా అనుకుంటే అది కేవలం అవివేకమన్నమాట.

ఉదాహరణకు : సంఘములో అందరూ ధనవంతులే వుండరు. నాకు కొంత డబ్బు అవసరమవుతుంది. మరొకరికి మరొకటి అవసరమవుతుంది. ఇలాంటివన్నీ ఒకరినుంచి మరొకరు ఎవరికి కావలసిన సహాయం వారు పొందుతూ సమిష్టి వితం గడపటమన్నమాట. ప్రతివాడు సాంఘికంగానూ, రాజయంగానూ, ఆర్థికంగానూ యితరులపై ఆధారపడి వుండాల్సిందేనన్నమాట. ఈ విషయాలు నిత్యం మీరు చూస్తూనే వుంటారు. ఒకవిద్యార్థి ప్రక్కవాడ్ని ఓ పుస్తకమో, పెన్నో

అడుగుతాడు. అట్లా రకరకాలుగా ఒకరినుంచి మరొకరు సహాయము పొందుతూనే వుంటారు. మన వూరిలో దుకాణాలున్నాయి గదా? మనకు ఏవయినా సరుకులు అవసరమయినప్పుడు వ్యాపారి మనకు అప్పు ఇవ్వడం, అతనికి ఏదయినా డబ్బు అవసరమయినప్పుడు మరోసహాయం మీ తల్లి దండ్రులు చేయటము మీరు గమనించే వుంటారు. ఇదంతా ఎందుకంటారు?''

''మనిషి సంఘములో ఏదోరకంగా ఇతరులపై ఆధారపడటము తప్పదు గనుక'' ముకుందం తపీమని తడుముకోకుండా సమాధానం చెప్పాడు.

''ఆ అది అదిరా అసలువిషయం. బాగా చెప్పావు. గనుక మనిషి సంఘ వి అని మనకు అర్ధమవుతోంది గదా, అందువల్ల సంఘంలో మనిషి విధి, హక్కు తెలుసుకోవడము వలన ఎవరిపనులు వారు సమర్ధవంతముగా చేసుకుంటూ ఇతరులకు హానిచేయకుండా సహకరిస్తూ వించగలుగుతారన్న మాట. ఒకవేళ ఇతరులకు ఇబ్బంది అంటే ఇతరుల స్వేచ్ఛకు గాని, వారి హక్కుకుగాని ఏవయినా ఇబ్బంది కలిగినప్పుడు వారిహక్కులు కాపాడుకునేందుకు చట్టంఅని ఒకటుంది అం నీకు సాంఘికంగా వున్న విధి నీవు సక్రమంగా నిర్వర్తించనప్పుడు నీ బాధ్యత నీకు తెలియచెప్పి స కమమైన పంథాలో మనిషి సంచరించేటట్లు ఆజ్ఞాపించి శాసించేది చట్టమన్నమాట. దాన్నే మనం న్యాయంఅంటాము. ఈ న్యాయా _న్ని గురించి చెప్పేదే నా యశాస్త్రం.

"ఉదాహరణకు నీ సాటి విద్యార్థి నీ జేబులోని సొమ్ము కాజేశాడనుకో. అప్పుడు నువ్వేం చేస్తావు ?"

"ఉపాధ్యాయులకు తెలియపరుస్తానండీ"

"వారు అతడ్ని దండిస్తారు ఎందువల్లనంటావ్? నువ్వు చెప్పరా రాముడూ ?"

"అది నేరంగనుక" రాముడు లేచి చేతులు కట్టుకుని శ్రద్ధగా చెప్పాడు.

"ఏం ఇందులో నేరమేముంది? డబ్బు నీకూ అవుసరమే వాడికి అవసరమే-అందుకే కాజేశాడని ఊరుకోవచ్చుగా" ఆయన తిరిగి ప్రశ్నించారు.

అవసరమైతే అడగాలి. అవసరము చెప్పుకోవాలి. కాజే యటము న్యాయంకాదు మాస్టారూ" మరో విద్యార్థి సమాధాన మిచ్చాడు.

"సరే ఐతే అలా దొంగిలించటము నేరమంటారు కనుక హెడ్‌మాష్టారు అతడ్ని దండించడం న్యాయమంటారు. అందుకు అతనికి ఏదోకొంత ఫైనో, లేక శిక్షో విధించాలంటారు ్నుక ఎవరు ఏంచేసినా ఇతరులకు హానితలపెడితే శిక్షించటం అనుభవించనిదానికి చట్టము న్యాయము చేకూర్చడము అవస రమే గదా? ఈ చట్టమూ, శిక్ష విచారణా లేకపోతే సంఘ ములో అవినీతి, అన్యాయం, అరాచకము లూటీలు ఇలాంటివి ఇంకా ఎన్నో?

వీటన్నిటివల్లా సంఘములో శాంతి-భద్రతలు నశించి

అరాచకము తలెత్తి అడుగు బయట పెట్టాలంటే ప్రతి మనిషి భయపడిపోతాడు. వ్యక్తిస్వాతంత్ర్యం నశించి దుడుకుతనములు చేరుతుంది.

స్వేచ్ఛ ఎప్పుడయితే అరికట్టబడిందో సంఘము అన్ని రంగాలలో కుంటుపడి ఆదాయము ఉత్పత్తులు వస విధానం నితా వసర వస్తువుల స్థంభన ఒకటేమిటి? గ కదిపితే డొంక మొత్తం కదులుతుందన్న మాట'' ఆగి ఊపిరి పీల్చుకున్నారు నరసింహంగారు. ఆ మాటకు విద్యార్థులంతా గొల్లుననవ్వారు. అక్కడ రిన వయోజనులు మాష్టారు చెబుతున్న విషయాలు అతికుతూహలంగా వింటున్నారు ఒకచిన్నపనితో ఇన్ని ముడి పెట్టబడి వున్నాయా? అని వారంతా ఆలోచిస్తూ చదువం ఇంతగొప్పదా అనుకుంటున్నారు.

''నేను చెబుతుంటే మీకు ఆశ్చర్యంగా వుంటుంది గాని మీరు ప్రతిరోజు ఇలాంటివి అనేక రకాలు చూస్తూనే వుంటారు. ఇప్పుడు నేను చెప్పబోయేవి పల్లెలకన్నా పట్టణ వాసులలో ఎక్కువ అనారోగ్యాన్ని అశాంతినీ కలిగించేవిగా వుంటాయి. తమగృహాలు కదాఅని త్రాగి యిష్టమొచ్చినట్లు వాగటము, అది యితరుల నిద్రకు భంగంఅని వారు గ్రహించరు. తమ యిండ్లలోని చెత్తాచెదారం మొదలయిన పాచి యితరుల గుమ్మాలలో వేయటం, రోడ్లపై నిలబడి దంతదావనం చేస్తూ మార్గంలో ఉమ్మివేయటం, మూత్రాలను, మలం రోడ్లవారన విసర్జించటం చేస్తుంటారు.

ప్రయాణ సాధనాలయిన బస్సులూ, కార్లలో, రైళ్ళ యందు ఎక్కడపడితే అక్కడ ఉమ్మి వేయటం, చదవటం, చెత్తాచెదారం వేయడంలాంటి అసహ్యకర పరిస్థితులకు బాధ్యు లవుతుంటారు.

తెలియక చేయడంలో కొంత అవివేకం వుంది. కాని తెలిసి చేయటం ఎంత అపరాధం ? మన్నించరాని అపరాధం అలాంటి వారిని శిక్షించడంలో ఎంతమాత్రంజాగుచేయకూడదు ఇవికాక హత్యలూ, లూటీలు, గృహదహనాలు, ఇవన్నీ యే విధంగా చూసినా సంఘక్షేమస్సుపైన దెబ్బ తీసేవే.

అయితే ప్రతి పౌరుడూ కొన్ని హక్కులు కలిగి వున్నాడు. మనది నిరంకుశ ప్రభుత్వముకాదు. ప్రజాస్వామ్యం కదా ? అని మనకు సందేహము రావచ్చు" నరసింహము గారు విద్యార్థులవంక చూశాడు.

"మాష్టారూ ! నిరంకుశ విధానాని , ప్రజాస్వామ్యా ని తేడా ఏమిటండీ " ఒక విద్యార్థి న మ్రతగా ప్రశ్నించాడు.

"అదీ తెలియని విషయాలుంటే శ్రద్ధగా అట్లా అడిగి తెలుసుకోవాలి నిరంకుశ ప్రభుత్వ విధానంలో వ్యక్తికి స్వేచ్ఛ వుండదు వాక్ స్వాతంత్ర్యం, ప త్రికా స్వాతం త్ర్యం, సభా స్వాతంత్ర్యం శూన్యం. నీకు తోచింది మాట్లాడకూడదు. నీ హృదయంలో భావాలు నోటితో రాకపోయినా వాని ప్రచారంచేసే హక్కు ఉండదు దానివలన వ్యక్తిలేక పౌరుడు బయట ప్రపంచంలో వుండికూడ ఖైదు అనుభవించవలసిందే.

పూర్వం మన బ్రిటిష్ పాలకుల నిరంకుశత్వానికి అదే విధంగా అవస్థలు పడ్డాం స్వాతంత్ర్యంకోసం, ఆత్మబలిదానం చేసిన మహానుభావులు ఎందరో ఈనాడు మన క్ష పెట్టారు అలాంటి వారి పేర్లు కొన్ని చెప్పండి చూద్దాం" నరసింహం ఆసక్తిగా అడిగారు.

"నేను చెబుతాను మాష్టారూ" గాంధీ, జవహర్ లాల్ నెహ్రూ?"

మరో విద్యార్థి లేచాడు. "సర్దార్ వల్లభాయ్ పటేల్ దేశబంధు చిత్తరంజన్‌దాస్" అంటూ తనకు తెలిసిన మరో రెండు పేర్లు చెప్పాడు.

"ఆఁ వారే కాదనుకోండి ఇంకెందరో మహానుభావులు మనకి స్వాతంత్ర్యం సమకూర్చిపెట్టారు. స్వాతంత్ర్యంవున్నది గదా అని మనిషి మరీ విచ్చలవిడిగా ప్రవర్తిస్తే చట్టం ఒప్పుకోదు అర్థమయిందా" పిల్లలంతా తెలుసుకున్నట్లు తలలూపారు.

"అయితే ఇక మనమిప్పుడు ప్రజాస్వామ్యాన్ని గురించి తెలుసుకుందామా? మరి అబ్బాయిలూ? ప్రజాస్వామ్యం అంటే ప్రజలే ప్రభుత్వం ఎన్నుకుని ఏర్పరచుకోవడమన్నమాట. అంటే మనలో వుండే అర్హతలూ, సదుపాయాలు గల మనుష్యలను మనమే ఎన్నుకుంటాం. పల్లెలలోవుండే పంచాయితీల వ్యవస్థ దగ్గరనుండి పార్లమెంటువరకూ ఈ ప్రజాప్రతినిధులే పాలకవర్గంగా వుంటారు. ఈ ఎన్నుకునే విధానం ఓటింగ్, అంటే ఓటుద్వారా జరుగుతుంది. దీనిని మనం ఎన్నికలు అన్న పేరుతో పిలుస్తున్నాం."

"ఈ ఓటుకి అపరిమితమైన విలువుందిరా విద్యార్థులూ, ఉదాహరణకు మీ పాఠశాల ఉంది అనుకోండి-స్కూలు విద్యార్థులందరి తరఫునా మీ మంచిచెడ్డలు చూడటానికి విద్యార్థులకు న్యాయం జరిగే విధంగా నడుచుకోవడానికి "ఎస్. పి. ఎల్. అంటే పాఠశాల విద్యార్థి సంఘనాయకుడ్ని ఎన్నుకుంటున్నారు. అతడు ఎలాంటి వ్యక్తిఅయి వుండాలి" పశ్నించారు.

"మంచివాడు, నలుగురి మేలుచేయ కలిగినవాడూ, ఆదర్శ యువకుడూకావాలి మాస్టారూ" శివప్రసాదుచెప్పాడు.

"సరే? మిగతా విషయాలు రేపు చెప్పుకుందాం"అంటూ నరసింహంగారు పైకి లేచారు. పిల్లలంతాగూడా పుస్తకాలు చేతపట్టుకొని మాస్టారుకి నమస్కరించి బయలుదేరారు. వయోజనులు కొందరు అప్పటివరకూ మాస్టారు చెప్పిన విషయాలు అత్యంత ఆశ్చర్యంగా విన్నారు. నిజంగా ఇన్ని విషయాలు తెలుసుకోవల్సి ఉంటుందని వారెన్నడూ ఊహించలేదు.

○ ○ ○

మరునాటి రాత్రి ఏడుగంటల సమయానికి విద్యార్థులంతా భోజనాలు ముగించుకొని చేతిలో లాంతర్లు పట్టుకొని ఆలయ మంటపంవద్దకు వచ్చారు. అప్పటికే నరసింహం మాస్టారు మంటపంమీద కూర్చుని ఆకాశంలో కనిపించేనక్షత్రాలవంక చూస్తున్నారు.

విద్యార్థులందరూ వచ్చి కూర్చున్నాక మాస్టారు గొంతు సవరించుకొని పాఠము చెప్పడము ప్రారంభించారు. అప్పుడే ఏమీ తోచక మాస్టారి పాఠాలు తనూ వినాలని వచ్చిన ప్రెసిడెంటు ధర్మయ్యగారు మాస్టారికి నమస్కరించి తనూ ఒక స్థంభానికి ఆనుకొని కూర్చున్నాడు మొదట ఈ "పౌరుడు" అన్న శబ్ధం రాజ్యములోవుండే గొప్పవారికి మాత్రమేవుండే దని, రానురాను పల్లెల్లో నివసించే వారికికూడా అన్వయింప బడిందనీ చెప్పుకున్నాము? ఇప్పుడు ఈ ప్రభుత్వములో అతడూ పాలుపంచుకుంటున్నాడన్నమాట. ఈ ప్రభుత్వ నిర్వహణ విధానములో యీనాడు స్త్రీలుగూడా భాగస్వాములే ఎందువలన అంటే యుక్తవయసు వచ్చిన అంటే మైనారిటీ తీరినవారు వారందరికీ ఓటుహక్కు వున్నదిగదా అందువలన ప్రభుత్వం ప్రజలది. కాకపోతే ప్రజలు ప్రభుత్వాని చట్టానికి విధేయులై మాత్రం వుండాలి.

"మరొకటి మీరు చక్కగా చదువుకొని పరిపాలనా యంత్రాంగాన్ని అర్థంచేసుకుని పదిమందితో మంచివాడు నాయకుడు కాగలిగినవాడు అనిపించుకున్నారనుకోండి మీరు ఎన్నికలలో పోటీ చేయవచ్చు. గెలుపొందిన యెడల మీరు మీ ప్రజల తరఫున ప్రభుత్వ ప్రతినిధిగా పరిపాలనా యంత్రాంగంలో పాలుపంచుకోవచ్చు. అట్టి విధంగానే మీ హక్కులు మీకు రక్షణ కల్పించడంలేదని తోచినప్పుడు ప్రభుత్వానికి అంటే పార్లమెంటుకు విజ్ఞప్తి చేసుకుని మీ

మీ హక్కులకోసము పోరాటం సాగించవచ్చు పోరాటమంటే కత్తులు - బల్లాలతో కాదు - న్యాయంకోసము శాంతియుత పోరాటమన్నమాట.

"మాష్టారూ నగరవాసులు-పట్టణవాసులు-గ్రామీణులు అందరూ పౌరులే అంటున్నారు కదూ ? మరి అసలయిన పౌరులెవ్వరు వీరిలో?" సుబ్బారావు అడిగాడు.

"చాలా మంచి ప్రశ్న వేశావురా సుబ్బారావు మంచి పౌరుని కుండవలసిన లక్షణములు ఏమిటా అని నీ సందేహము అవునా?"

"అంతేనండి" విద్యార్థులంతా సుబ్బారావు వంక చూశా రొకసారి. అతని ప్రశ్న వారందరికీ ఎంతో నచ్చింది.

"ఇతరులకు సహకరించటం, మంచి స్వభావం కలిగి ఉండటము స్వార్థచింతనలేక సంఘ శ్రేయస్సుకు పాటుపడ టము విద్యకలిగివుండటము ప్రభుత్వా పాయాలందు సంసి ద్ధత మంచి చెడులు చర్చించి సహనముతో నిర్ణయం తీసుకో గలగటం సోమరితనము లేకుండా ఉండటము దేశ రక్షణ - అవసరమైతే దేశము కోసము ప్రాణత్యాగము చేయగలిగి వుండటము ధర్మబుద్ధి ధారి కత కలిగిన వారిని మంచి పౌరులు

అంటారు, అందరూ ఇలాంటి పౌరులున్నారనుకో ఆ నగరం ఆదర్శవంతమైన భూతలస్వర్గంగా మారటం ఖాయము. అవి నీతి-అశాంతికి చోటు ఉండదు కదా మరి?'' మాష్టారు? సుబ్బా రావు ప్రశ్నకు సమాధానం చెప్పాడు.

విద్యార్థులమీదా-చివరకు ప్రెసిడెంటు ధర్మయ్యగారిపై కూడా మాష్టారి మాటలు పనిచేసినట్లున్నాయి. వారంతా ఆత్మ పరి లన ప్రారం ంచారు.

అది గ్రహించిన మాష్టారు వారికి కొంతసేపు ఆలోచిం చుకునే అవకాశమివ్వటమే మంచిదనుకొని మౌనంగా శూన్యం లో చూస్తుండిపోయారు.

అసలు విద్యాబోధన కంగారులేకుండా విద్యార్థులు విషయం గురించి ఆలోచింపచేసేదిగా వుండాలి. అప్పుడే అతడు విన్న విషయంలోని మంచి-చెడుల పూర్వాపరాలు ఆలోచించి అతడు నిశ్చలమైన నిర్ణయం తీసుకోగలుగుతాడు విద్యార్థులు సంకల్పము వారు సుకునే నిశ్చల నిర్ణయమే రేపు భవిష్యత్తుకు ఉపయోగించేది.

''పౌరుడు అంటే ఇప్పుడు మనము ఏం అర్థం చేసు కున్నాం తనకు వారసత్వంగల దేశమునందు భక్తి, పౌరుగు వారి మీద ప్రేమ-దయ గలిగియుండి ఆ దేశములో ఎన్ని కలమందేగాని ఉద్యోగం న్యాయము మొదలయినవన్నీ గల

తన హక్కులను పోషించుకుంటూ తనకు సాంఘికంగా కలిగిన విధులను నిర్వర్తించువాడని అర్థముయుంది” తిరిగి చెప్ప నారంభించారు మాష్టారు.

పౌరునికి గల హక్కులు రెండురకాలురా అబ్బాయిలూ అందు మొదటిది పొలిటికల్, మరియూ రెండవదానిని సివిల్ అంటారు. సరే సివిల్ హక్కు అంటే ఏమిటో చెప్పుకుందాం. ఆత్మరక్షణ అనే విధానమును గురించి చెపుతాను శ్రద్ధగా వినండి. ఈ ఆత్మరక్షణ విధానము అనేది ప్రతి జీవరాశికి పుట్టుకతోనే వస్తుంది. రోడ్డుపై ఒక కుక్క వెళుతుందనుకో. నువ్వు ఒక రాయి నుకుని దానిమీద విసిరావు, అది వెంటనే ఏమి చేస్తుందిరా ప్రసాదూ?” చిరునవ్వుతో అడిగారుమాష్టారు “మొరుగుతూ వెంటబడి కరుస్తుందండి” ప్రసాదు సమాధానము చెప్పాడు. ఆ సమాధానానికి అందరూ ఒక్కసారి నవ్వారు.

“సరే నువ్వు కొట్టావు. అది కరిచింది. ఇందులో ఎవరిది తప్పు? కొట్టడము తప్పు అంతేకాని నువ్వు కొట్టాక అది నిన్ను ఆత్మరక్షణ కొరకు కరవటము తప్పుకాదు గదా అయితే అది జంతువులకు సంబంధించిన విషయము. పాపము వాటికి జ్ఞానము, నోరులేదు కనుక చెప్పలేవు. కాని ఆత్మరక్షణవిధానము వాటికీవుంది. “సరే ఒకడు తనదారిన తను పోతున్నాడురా ఓ నలుగురు అతనిపై బడి చావబాదడము ప్రారంభించారనుకోండి. అతను పాపము అని ఊరుకుంటాడా ఊరుకుంటే వారితో చావుదెబ్బలుతిని మరణించడము ఖాయం అంటే ప్రతి వ్రతకాలనే అనుకుంటుంది. బ్రతికేహక్కుంది

అందువలన తనకు ఏదయినా ఆపద సంభవించినప్పుడు ఎదురుతిరిగి ఆత్మరక్షణ చేసుకోవడము తప్పు కాదు.

ఈవిధంగా తన ప్రాణానికి హాని సంభవించినప్పుడు ఆత్మ రక్షణ కోసము ఏదయినా ఆయుధమో మరోటో ఉపయోగించి రక్షింపబడే హక్కు ప్రతి పౌరుని వుంటుంది. ఇతరులు తనకు హాని తలపెడుతున్నారని తెలిసినప్పుడు ఆయుధమేదయినా ఆత్మరక్షణార్థము వుంచుకోవచ్చు. అంతేగాని ఈ హక్కువుంది గదా అని ఇతరులను హత్యచేసినో, చావకొట్టో, ఆయుధాలను ఉపయోగిస్తే ఆ నేరస్థుడిమీద చట్టరీత్యా చర్య తీసుకుంటుంది ప్రభుత్వం.

అలాగే హక్కుల్లో చాలా రకాలున్నాయని చెప్పుకున్నాము గదా? ఒరేయ్ రఘూ మీకెంతఆస్థి వుందిరా?" రఘు అనే విద్యార్థినడిగారు నరసింహముగారు, విద్యార్థులకు నరసింహముగారు ఈప్రశ్న ఎందుకు వేశారో అర్థము కా దు.

"పాతిక ఎకరాలు, కొంత బంగారము, కొంత డబ్బు వుందం " రఘు నవ్వుతూ గర్వంగా సమాధానము చెప్పాడు

"అది నీదా మీ నాన్నగారిదా" మళ్ళా ప్రశ్నించారాయన.

"అదేంటి సార్ మా నాన్నగారిది నాది కాదా" రఘు అమాయకంగా అడిగాడు.

"సరే-మీ నాన్నగారిది నీదవుతుంది బాగానే వుంది. దీనిలో మరో ఇద్దరిదీ అవుతుందా "

అవదండి అది మాది కదండి

"అంటే తండ్రి సంపాదించింది కాని నువ్వు సంపాదించుకున్నది కాని కేవలము మీరే అనుభవించే అధికారమూ, హక్కు వున్నదన్నమాట. కనుక దీనినే "ఆస్తిహక్కు" అంటారు. "ప్రాపర్టీరైట్" అన్నమాట. అంతేగాని వొకరిది మరొకరు అనుభవించాలని చూడటం నేరము అవుతుంది. ఐతే నా ఆస్థి నా ఇష్టంఅని నువ్వు ఈ సంపదలతో ఇతరులకు అంటే సంఘవిద్రోహక చర్యలు చేయగూడదు అర్థమయిందా అదేవిధముగా "సభా స్వాతంత్ర్యము" అని మరొకటుందిరా

"మీలో ఎవరైనా తెలిస్తే చెప్పండి చూద్దాముమరి! అసలీ సభేమిటి? దానికి స్వాతంత్ర్యము ఏమిటి? కుతూహలముగా ప్రశ్నించారు మాష్టారు. పిల్లలో చలనం కనిపించలేదు కళ్ళల్లో ఆలోచనలు మాత్రం కదలాడుతున్నాయి.

"అయ్యా మాష్టారూ నీఊరికి ప్రెసిడెంటును. మీరు వేసిన ప్రశ్నకు సమాధానము నాకే తెలవదండి. ఇంకావాళ్ళేం చెబుతారండి పిల్లలు" అదో మాదిరిగా నవ్వుతూ అన్నాడు ప్రెసిడెంటు ధర్మయ్య. అందరూ గొల్లుమనటము, వారితో పాటు మాష్టారుకూడా శృతి కలపటం జరిగింది.

"బాగా చెప్పారండి ధర్మయ్యగారూ సరే అందరూ వినండి ప్రతి మనిషి మాట్లాడేహక్కు కలిగి వుంటాడు. నోటికేదొస్తే అది మాట్లాడటము, ఎదుటి వారిని తూలనాడి కసిర్చుకోవడము మాత్రము కాదు. తన వాక్ స్వాతంత్ర్యాన్ని పురస్కరించుకుని సమావేశాలూ, సభలూ జరుగుతున్నప్పుడు తనకుగానీ, తనలాటి వారికిగానీ అన్యాయము జరుగు

చున్నదని తాను విశ్వసించినప్పుడు, ఇతరులకు బాధాకరము గానూ, అవమానము కలిగేవిగానూ లేకుండా న్యాయ సమ్మతంగా మాట్లాడేహక్కు _క అధికారాన్ని వాక్ స్వాతం త్రియము అంటారన్నమాట. కానీ, దీనికి చాలాచోట్ల వ్యతిరేకముగా జరుగుతుంది. తాను అధికారిననో, ఆసామిననో అందరినీ అయిన దానికి కాని దానికీ తూలనాడే వారు అధికమయ్యారు. నేను మీకు ఉపాధ్యాయుడనే. మీరు నాకు గౌరవమియ్యవలసిందే. అందుకని మిమ ల్ని చీటికి, మాటి కి బాదటం ప్రారం ంవాననుకోండి ? మీలో తిరుగుబాటు తత్వము తప్పక తలెత్తుతుంది. ఎందువల్ల ? మీరు నాకు బానిసలుకాదు పడి వుండటానికి స్వతం త్రులు పైగా విద్యార్థులు మీరు. నేనూ ఒకరిని ఒకరు పరస్పర గౌరవ మర్యాదలు యిచ్చి పుచ్చుకుంటే ఎవరి విధి వారు సక్రమంగా నిర్వర్తించవచ్చు. ఎవరి హక్కుని వారు కాపాడుతున్నట్లు వుతుందన్న మాట అవునా ? కాదా ?''

"అంతేనండి నిజమే మాస్టారూ " పిల్లలతోపాటు ప్రెసిడెంటుగారుకూడా అన్నారు.

ప్రెసిడెంటుగారుకూడా తమతోపాటు విద్యార్థిలాగా తల ఊపుతూ సమాధానం చెబుతుంటే అందరూ మరొకసారి నవ్వారు. వారికి పాఠము వినటము తలనొప్పిగా గానీ, మరో విధముగాగానీ లేక, చక్కగా నవ్వులతో మధ్యమధ్యన సందడిగా వుంది.

"ఇక చాలు మరోసారి నవ్వుకుందాము. వారిని కొంత పు నవ్వనిచ్చి మాస్టారు తిరిగి ప్రారం ంచారు. "అబ్బా

యిలు వ్యక్తికిలేక పౌరునికున్న స్వాతంత్రియాలలో మరొక ముఖ్యమయింది "పత్రికా స్వాతంత్ర్యము" ప్రతిమనిషి కొన్ని రకరకాల భావాలు ఉంటాయి. ఆ భావాలే కవిత్వానికి గాని, రచనకుగా ఇతరులను విమర్శించడానికిగాని పని కొచ్చేది. ఇలాంటి వ్యక్తులు అందరూ వ్రాయలేరు గనుక చెబుతున్నాను వ్రాయగలిగితే అందరి వుంది స్వాతంత్రియము ఐతే సమాజము పరిస్థితులూ, ఆర్థిక రాజకీయ సాంఘిక వాతావరణముతో యీ వాసే వ్యక్తి చక్కటి సత్ సంబంధము కావాలి, అంటే అతడు తప్పనిసరిగావిద్యావంతుడై వుండాలి. లేకపోతే ఏమి చెప్పగలుగుతాడు? ఏమి వ్రాయగలుగుతాడు.

ఇప్పుడు మనతోపాటు సంఘములో తిరిగే కొన్ని పెంపుడు జంతువులు మనవద్దకువచ్చి కళ్ళతో ఏవేవో భావాలు వెలిబుచ్చుతూ వుంటాయి. కాని చెప్పేందుకు నోరులేదు. ఐతే చెప్పేందుకు భావము చెప్పాలన్న తహతహ వుంది కానీ నోరులేదన్నమాట మనసులో అనేక రకాల భావాలువుండవచ్చు. కాని చెప్పే అర్హత అంటే విద్య ఎంత అవసరమో చూశారా? అందుకే అన్నారు పెద్దలు "విద్యలేనివాడు వింత పశువు" అని అర్థమయిందా? సరే, వీరి భావనలు, అ ప్రాయాలూ, పత్రికాముఖముగాగానీ, ఇతర గ్రంథరూపాలలో గానీ చెప్పవచ్చునన్నమాట.

ఐతే యీ రచనలూ, యీ భావాలూ, సాంఘిక శ్రేయస్సును పెంచవిగానూ, సర్వమానవ సౌభాతృత్వాని

నాంది గీతం పలికేవిగా ఉండాలి. అంతేగానీ, సంఘములో అవినీతి, అహింసా ప్రేరేపించి భద్రత నిర్మూలించే విధముగా వుండకూడదు అయితే ఈ పత్రికల ద్వారానూ, ఈ రకమైన గ్రంథాల ద్వారానూ వచ్చే రచనలు కొన్ని "కల్పనలు" అంటే వీటివల్ల పెద్దనష్టమేమీ ఉండదు చదువుకోవడానికి తమాషాగా వుంటాయ్ ఆ రకమైన కథలు అంతేకాని, సాంఘిక పరిస్థితులలో కానీ, రాజకీయ వాతావరణంలోగాని కల్పనలు పని రావు.

మరొకటి విప్లవ సాహిత్యము. ఈ రకమైన సాహిత్యం సహజముగా ఎప్పుడు అవసరమవుతుందంటే పాలనా పద్ధతులలో అవక తవకలు జరిగి, ప్రజలలో అశాంతి చెలరేగి పరిస్థితులు అర్థముకానప్పుడు ఈ సాహి వేత్తలు ప్రజలలో విప్లవ భావాలు రేకెత్తించి వారి దృష్టిని సక్రమ విధానమువైపు మళ్ళించాలి. ఇందులో కూడా ఏ రకమైన దూషణలకు చోటుండకూడదు. తన భావాలూ, రాసే అర్హతా అధికారము వున్నదని ఏ స్వప్రయోజనాన్నో ఆశించి, శాంతియుత వాతావరణాన్ని తన రచనల ద్వారా కలుషితం చేయుటము చట్ట విరుద్ధమన్న మాట.

"మాష్టారూ చట్టమంటే ఏమిటండీ ?" మరో విద్యార్థి ప్రశ్నించాడు.

ప్రతి పౌరునికి హక్కులూ, విధులూ, విధించబడి వున్నవే భారతీయ రాజ్యాంగము రూపొందించబడింది. రాజ్యానికి అంటే ప్రభుత్వాని , ప్రజలకూ వుండే సంబంధము

హద్దులు ఉల్లంఘించినవారికి న్యాయశాస్త్రము ఆ న్యాయాన్ని ఎదిరించినవారికి సంఘ శేయస్సు దృష్ట్యా శిక్షాస్మృతి ఏర్పాటు చేయడము జరిగింది. దానినే చట్టం అంటున్నాం. అదొక విధాన పద్ధతన్నమాట.

"అదేవిధముగా మనిషి పుట్టాక జీవించాలంటే ఏదోఒక వృత్తిఅంటే వ్యాపకము అవసరం కదా అందరూ విద్యార్థికు లుండరుగదా. మరికొందరు వ్యవసాయం, మరికొందరు ఉద్యోగాలూ, ఇంకొందరు చేతిపనులు ఆ విధంగా పతిమని షి మనుగడ సాగించాలంటే ఒకవృత్తి అవసరమన్న మాట.

ఈ వృత్తివిషయంలోగూడా పతిమనిషికి పరిపూర్ణ స్వాతంత్ర్యము వుంది. కులమతాలతో పమేయము దు. ఉదాహరణకు చాకలి వున్నాడనుకుందాం. అతని కుమారుడు మరలా అదేవృత్తి స్వీకరించాలన్న నిబంధన ఏమీలేదు. చక్కగా చదువుకొని వుద్యోగం చేసుకోవచ్చు లేక శక్తుంటే వ్యాపారం మరొకటి అతనికి దేనియందు ఆ రుచి వుంటే ఆ వృత్తి స్వీకరించే స్వాతంత్ర్యం వున్నది. అయితే ఈ వృత్తి స్వాతంత్ర్యాలలోకూడా కొన్ని నిబంధనలున్నాయి. కొందరు కేవలం తమ సంపాదనకోసం, సంఘ శేయస్సును దృష్టిలో వుంచుకోకుండా అక్రమ వ్యాపారాలుచేస్తూవుంటారు ఆరోగ్యాని పమాదకరమైన మద్యముఅంటేసారాయిలాంటి వన్నమాట. తర్వాత నల్లమందు, గంజాయి అవీ దొంగ రవాణాలు చేయడం, కల్తిసారాయి కాపుకాచి అమ్మకము సాగిం

హే-వి- )

చడము, ఆయుధాలూ నాటుబాంబులు లాంటివి తయారుచేసి విక్రయించడమూలాంటివి అక్రమ మార్గాలు కనుక చట్టత్యా ఇలాంటివృత్తులు నిరోధించబడినాయి. కనుక ఇప్పుడు మనకు వృత్తిస్వాతంత్ర్యం గురించి అర్ధమైనట్లేకదా.

మాస్టారు మంచి అన్నది అనాదినుంచి పూర్వీకులు బోధిస్తూనేవున్నా మనిషి చెడులు ఆచరించటం మానడేమంది అన పరిస్థితులకూ అశాంతికి కారణం స్వార్థం కాదంటారా ప్రెసిడెంటు ధర్మయ్య అడిగాడు.

"కాదా ఏమిటి" అక్షరాలా స్వార్థమే ఒకనాడు అడవి మనిషి జంతువులాగా సంచరిస్తూ, ఫలాలు, పళ్ళూ, పచ్చి మాంసం తిన్నరోజులున్నాయి. నిజం చెప్పాలంటే ఆనాటి మనిషి ఈ స్వార్థాలూ, సంకుచితాలూ తెలియవు. దొరి ంది తిని వేరే గొడవలేకుండా ఏ చెట్టుతొ రలోనో, ఏ కొండగుహ లోనో తలదాచుకునేవాడు అయితే రానురాను ఆసక్తి, ఉత్సు కత పెరిగిశోధించడం నేర్చుకొని క్రమ కమముగా వనవికా సము ఏర్పరచుకొన్నాడు.

ఐతే ఈ విధముగా ప్రతిమనిషి తనబాగు తను చూసు కుంటూపోతే అవినీతి పెచ్చుపెరగడం, అరాచకాలు పెరిగి పోవడం అశాంతి నిండటం మినహా మరేమీ దు. చట్టమైనా చెడుని ఖండించడం కోసం మంచి పెంపొందించడంకో సం మాత్రమే. అంతా చెడే అయితే చట్టం మాత్రం ఏమి చేయ గలుగుతుంది?

కను ఎవరి వారు మంచిచెడుల తారతమ్యతలు ఆలోచించుకుంటూ మంచి ఆచరించడానికే ప్రయత్నించాలిఅప్పుడే ఏ రాజ్యాంగానికయినా రాణింపు. ఏ దేశ పౌరునికయినా శాంతి. అంటే ఒక్కమాటలో చెప్పాలంటే ఈ చట్టాలకూ శాసనాలకూ సమస్త రాజ్యాంగాలకూ మూలము మంచి, మానవత్వమూ అది లోపించిననాడు యెవ్వరూ ఈ సంఘాన్ని బాగ చెయ్యలేరు అసాధ్యం! సరే ఇంక ఈ రోజుకు పాఠము ఆపదాము. ఇంతవరకూ మీరు విన్న విషయాలలో కొందర్నికొన్ని పశ్నలు వేస్తాను సమాధానాలు చెప్పండి"

అప్పటివరకూ నరసింహముగారు చెప్పిన విషయాలలో కొన్ని పశ్నలు వేశారు. విద్యార్థులు తృప్తికరమైన సమాధానాలు చెప్పటంతో నరసింహంగారికి, ప్రెసిడెంటుగారి కూడా తృప్తిగావుంది. అందరూ ఆలయంనుంచి బయలుదేరారు పెసిడెంటుగారివద్ద సెలవు సుకుని నరసింహంగారు ఇంటివైపు సాగిపోయ్యారు.

ప్రెసిడెంటుగారు చల్లని మంచినీరు త్రాగి నోటిల్లోచుట్ట పెట్టుకుని తన వీధి అరుగుమీద కూర్చున్నారు. ఆ గ్రామస్థులు చాలామంది రాత్రిళ్లు ధర్మయ్యగారి వద్ద కూర్చుని కాలక్షేపము ఆమాటా ఈమాటా మాట్లాడుతూ పొద్దుపొయ్యేదాకా కూర్చోవడము అలవాటు. ఒకరోజు గ్రామ స్థితిగతులమీదా మరొకరోజు పంటపొలాల గురించీ ఏదో ఒకరకమైన సంభాషణలతో కాలక్షేపము చేసుకుపోవటము వారికి అలవాటు.

కాని ఈరోజు ధర్మయ్యగారు విషయము మళ్ళించారు. ఆలయంలో నరసింహం మాష్టారు తనకు చెప్పిన పౌరసత్వపు విధులు, హక్కులగురించి ఒక చక్కని కథగా వారికి చెప్పనారం ంచారు వా విషయాలు ఆశ్చర్యముగానూ, వినటానికి కుతూహలముగా వున్నా ధర్మయ్యగారికి ఈ విషయాలన్నీ తెలిసినట్లు వారి తెలియదు. చివరకు ఒక వ్యక్తిఅడిగాడు. "ధర్మయ్యన్నా, ఈ విషయాలు ఎవరిదగ్గర విన్నావు? మా కెప్పుడూ పూర్వము చెప్ప దే?" అంటూ.

ఆ మాటలకు ధర య్య నవ్వుతూ సమాధానము చెప్పాడు. "ఒరేయ్ విద్యలేని గ్రామములో ఎందరు ధనికులున్నా సుఖంలేదురా మనవూరికి ఒక చక్కని మాష్టారొచ్చారు, ఎంత మంచివారో, ఎంత సమర్థులో మీకుతెలియదు. నిజంచెప్పాలంటే మనమంతా గుడ్డివాళ్ళంరా" ఆవేశంగా అన్నారాయన.

"అదేంటన్నా మనందరి చక్కగా కళ్ళుంటే గుడ్డోళ్ళమంటావ్" మరోవ్యక్తి ఆశ్చర్యంగా నోరుతెరిచి అడిగాడు.

"అంతేరా, లోకజ్ఞానం లేనివాడూ, ఉనికి తెలియనివాడూ కళ్ళున్నా గుడ్డివాడిక్రింద లెక్కరా రేపు రా త్రికి మీరంతా ఆలయములోకి రండి. ఆ మాష్టారు చెప్పే విషయాలు వింటే అసలు మనము ఎందుకుపుట్టాము? ఏమి సాధించాము? అని మీకే తెలుస్తుంది.

ఒరేయ్, ఆయన ఏమి చెప్పారో తెలుసా? సకల గ్రంథాలకూ, రాజ్యాంగాలకూ మూలము ఒక్కటేనట ఏమిటో

తెలుసా?" వారందరివంక చూశాడాయన వారందరూ అమాయ కముగా తలాడించారు కాని సమాధానము చెప్పలేదు.

"మీరంతా రోజూ నా దగ్గర కెందుకొస్తున్నారురా?" తిరిగి ప్రశ్నించాడు.

"మంచివాడివి నాలుగు మాటలు చెపుతావు గనుక" ఈసారి సమాధానం చెప్పారు.

"ఆఁ......అది ఆ మంచేనంటారా అర్థమయిందా? అది గనక ప్రతి మనిషిలో వుంటే ఈ చట్టాలూ, న్యాయాలు ఏమి అక్కర్లేదంటారాయన!" అంటూ ఆవులించడముతో అందరూ లేచి ఎవరిండ్లకు వారు బయలుదేరారు.

మరుసటిరోజు రాత్రి నరసింహముగారు ఆలయ మంట పానికొచ్చేసరికి కాస్త ఆలస్యమయింది. అప్పటికే పిల్లలంద రితోపాటు పెసిడెంటుగారూ ఇంకా చాలామంది పెద్దవారు వచ్చి కూర్చున్నారు, కొత్తవారెవరయినాచూస్తే ఆ రోజు అక్కడ ఏ హరికథా కాలక్షేపమేమన్నా ఉన్నదేమో అను కుంటారు. వారంతా మాష్టారు రాగానే నమస్కరించి కూర్చు న్నారు. పెద్ద వారంతాకూడా అంత శద్ధగా రావడముతో నరసింహంగారికి నిజంగా సంతోషమయింది.

"ఊఁ...మీరూ పాఠాలు వింటారన్నమాట? స రాత్రి ఎంతవరకు చెప్పుకున్నాము?వృత్తిస్వాతంత్ర్యం గురించీ మనిషి అవలంబించకూడని వృత్తుల గురించి చెప్పుకున్నాము గదా? మరి మనము మాటిమాటికీ, చట్టమూ, న్యాయమూ

అనుకున్నాం గదా? అసలు వీటి స్వరూపాలేమిటో? మనము ఒక్క క్షణం ఆలోచిద్దామా?"

"మాష్టారూ! ఈ చట్టం అందరికీ ఒకే విధంగా ఉంటుందాండి?" గాంధీ అనే విద్యార్థి లేచి అడిగాడు.

"అదే చెప్పబోతున్నాను మంచి ప్రశ్న వేశావురా గాంధీ. మనలో చాలా మంది తమకు సాంఘికంగా ఏమైనా అన్యాయాలు జరిగినప్పుడు తాము దవారమనో, లేక కులం తక్కువ వారమనో తమకు జరిగిన అన్యాయాన్ని ప్రభుత్వానికి తెలియపరచటానికి సంకోచిస్తారు. అంతేకాక చట్టము కేవలం ధనికులకోసం చేయబడిన ఒక చట్టంగా భావిస్తారు. అది సరైన ఊహ కాదు.

ఈ చట్టానికి వారూ, వీరు ఏమీ వుండదు. జాతి, కులం మతం. రంగు వీటితో దీనికి ఎట్టి సంబంధము లేదు ఒక దేశములో పౌరసత్వమున్న ప్రతి మనిషి ఈ చట్టము. న్యాయా విషయంలో ఒకే విధమైన న్యాయము జరుగుతుంది. దీన్ని మనము ఏమంటామంటే "చట్ట సమానత్వము" అంటాం అన్యాయం జరిగి తనకూ తన వ్యక్తిత్వాని భంగకరమని పించినప్పుడు రాజ్యాంగ చట్ట ప్రకారం పతి పౌరుడు అర్హుడే! ప్రతి మనిషికీ న్యాయం పొందే హక్కు వుందన్న మాట. గాంధీ శ్రద్ధగా తలవూపాడు.

"మాష్టారూ మన మాతృభాష తెలుగుగదా? తెలుగు కాక ఇతర భాషలు ప్రతి మనిషి నేర్చుకొనవచ్చునా?" మ విద్యార్థి ప్రశ్న.

పరిశుభ్రంగా పతి మనిషి అభిరుచినిబట్టి తెలుగు హిందీ, ఇంగ్లీషు నీ ఇష్టం. నీ అ రుచినిబట్టి పతిభాషా అధ్య యనం చేసుకోవచ్చు. ఆ హక్కువుంది. దానికి ఏ విధమయిన అభ్యంతరం లేదు. ఐతే నీకు వచ్చిన భాషను మాత్రంమెచ్చు కుంటూ ఇతర భాషనూ, ఇతర కులస్థులనూ దూషించడం లాంటివి మా తం చట్టు వ్యతిరేకమైన విషయాలన్న మాట.

విద్యార్థులూ వీటన్నింటికి మూలం ఒక్కటేగా నీకు ఇష్టంలేనిది విడిచిపెట్టు, విమర్శించకు నీ అ రుచి ఆశయం ఎటువంటిదో మిగతా వ్యక్తుల అ రుచులు-ఆశయాలు అలాం టివేగదా అందుకే పెద్దలు చెప్పారు,నీకు ఇతరులు ఏమి చేయకూడదని ఆశిస్తున్నావో నీవు ఇతరులకు అది చేయకు అని అర్థమయిందా? మీలో ఒక్కరు చెప్పండి” పశ్నించా రాయన.

ఆ పశ్న విద్యార్థులనేకాక పయోజనులను గూడా ఉద్దే శించి అడిగినట్లుండటంతో పెసిడెంటుగారు లేచి విద్యార్థిలా చేతులు కట్టుకొని నిలబడి చెప్పడం ఆరం ంచే సరికి మాష్టా రితో పాటు అందరూ పొట్టలు చెక్కలయ్యేలా నవ్వారు ఇంకా నవ్వుతున్న మిగతా వారినుద్దేశించి అన్నారు మాష్టారు.

“ఒరేయ్ మీకింకో తమాషా సత్యము చెబుతాను వినండి మరి పెసిడెంటుగారు ఆ విధముగా నిలబడేసరికి మన కందరి నవ్వువచ్చింది. ఎందువల్లనంటే ఆయన ఈగ్రామానికి అధ్యక్షుడు గనక కానీ ఆయనకు ఆ గర్వముకానీ, ఆ విధ మయిన స్పృహగానీ దు, తనకు తెలియని విషయాలు

తెలుసుకుంటున్నారు గనుక ఆయన ఒక విద్యార్థిలాగానే భావిస్తున్నారు. అదేరా అసలయిన విద్యార్థి లక్షణం.

విద్యార్థి అంటే పలకా, బలపమూ పుచ్చుకొని బడి వెళ్ళే పిల్లలూ మీలాంటివారనే కాదు విద్యను ఆర్జించువాడు అని దానికి వయసుతో పనిలేదు. శ్రద్ధ, గురువుల యెడ భక్తి వుంటేనే అతడు వుత్తముడు కాగలడన్నమాట. సరే చెప్పండి ధర్మయ్యగారూ అంటూ ఆయన కవకాశమిచ్చారు.

"నా డూపాయి ఒకరు కాజేశారనుకోండి నాకు బాధ కాజేసిన వారిమీద క్రోధం ఇలాంటివి కలగటం సహజం. దుర ప్రాయం, అసహ్యం కలుగుతున్నాయి కనుక నేనూ ఇతరుల సొమ్ము కాజేసి ఈ విధమైన అ ప్రాయానికి, దుర ప్రాయానికి గురికావటం మంచిదికాదు" అంటూ స్తంభానికి ఆనుకుని కూర్చున్నారాయన.

"అదిరా ధర్మయ్యగారు చెప్పింది. అందరికీ అర్థమైందా? నీకు ఇతరులు బాధ కలిగిస్తే ఎంత విచారిస్తావో అందువలన నువ్వు ఇతరులను బాధించకు అని అర్థం స ఇంక విషయానికొద్దాం మనం ఇంతక్రితం ఏంచెప్పుకున్నాంరా గాంధీ ?"

"భాషా స్వాతంత్ర్యము గురించి మాష్టారూ"

"తర్వాత మత స్వాతంత్ర్యం మనకు హిందూ మతమనీ, ఇస్లాం మతమనీ, క్రైస్తవమనీ యీ విధంగా రకరకాల మతాలున్నాయిగదా ? ఒక హిందువు క్రీస్తుమతం స్వీకరించా డనుకుందాము. దానివలన ఎవరి ఏ విధమైన అభ్యంతరం వుండటంగానీ, అతన్ని విమర్శించే హక్కుగాని వుండదు. ఆ

మత సిద్ధాంతాలు సమ్మతమైతే ఆ మతప్రవక్తల ఎడల నీకు నమ్మికా, విశ్వాసము గనుక వుంటే నీవు ఆ మతాన్ని స్వీకరించే హక్కు వుంటుంది. ఐతే ఏ మతము గొప్పదన్న భావన నీకు వుండటము మంచిదే. దాన్నెవరూ కాదనరు. కాని ఇతర మతాలను, మనుషులను దూషించే హక్కు, విమర్శించేహక్కు మాత్రము నీకుండదు దీన్ని మనము మత స్వాతంత్ర్యము అంటాము''

''మాష్టారూ మనుషులంతా ఒకేవిధముగా పుట్టి గిడుతున్నప్పుడు ఇన్నిరకాల మతాలెందుకండి?'' ఒకవిద్యార్థి ప్రశ్నించాడు.

అన్నిమతాల ముఖ్యోద్దేశమూ ఒకటేరా మానవత్వం ప్రేమ, దయ, సత్యమూ, భూతదయ ఇవియే ఇన్ని మతములకు సూత్రాలుఐతే మనిషి మతము నమ్ముతూ మత సూత్రాలను మాత్రం మరచిపోతున్నాడు అక్కడే వస్తుందిరా చిక్కు ఇప్పుడు మనం ఒక బీజము నాటుతున్నాము. అది పెరిగిఫలించినప్పుడు వాటిని ఆరగిస్తూ ఆనందించటము మంచిదే కానీ, దానికి ఆధారమైన బీజాన్ని విస్మరించటము మంచిది కాదు గదా?''

నేను కితం చెప్పినట్లు అన్ని మతాలూ భగవంతుని సాన్నిధ్యానికి దారిచూపేవే. దైవమూ ఒక్కడే. కాని వీరి అభిరుచులూ, అభిప్రాయాలలో మాత్రమే తేడా నదులన్నీ ఎటు పయనించినా సముద్రములో కలిసిపోవలసిందే కదా?

సరే ఇప్పటివరకూ మనము మనిషికున్న హక్కులలో

ఒకరకమయిన హక్కులను గురించి చర్చించుకున్నాము అవి ఏ రకమయిన హక్కులనుకున్నామో చెప్పండి చూద్దాం

"సివిల్ హక్కులండి" అందరూ ఒక్కసారి అరిచారు.

"అసలు ఇవి ఎన్ని రకాలనుకున్నాం?" రెండు రకాలండి సివిల్ హక్కు, రెండు రాజకీయ హక్కులు. పొలిటికల్ హక్కులు అంటే రాజ యపరమయిన హక్కులన్న మాట. అవేమిటో చూద్దాం, రాజకీయపరంగా పౌరునికుండే హక్కులు మూడురకాలుంటాయి. ఉద్యోగపు హక్కునీ, 2. ఓటింగు హక్కునీ, మూడవది విజ్ఞప్తిహక్కు అంటారన్నమాట. ఉద్యోగపు హక్కంటే ఏమిటంటే మీలో ఒకవిద్యార్థి వున్నాడు. అతనికి చదువు సంధ్యలమీద ఆసక్తిలేక ఏ సెకండ్ ఫారంతోనో చదువుకు స్వస్తి చెప్పాడనుకుందాం అతను వించాలంటే మరి ఏదోరకమయిన ఉద్యోగం వుండాలికదా అలాగని తనకు ఒకఆఫీసులో ఆఫీసరు వుద్యోగమో, లేక సూపర్వైజర్ ఇలాంటివి కావాలంటే కుదరదు ఎందువల్ల?"

"అతనికా వుద్యోగం చేసేందుకు చాలినంత విద్యార్హత లేదు గనక" ఒకవిద్యార్థి సమాధానం చెప్పాడు.

"నిజం వున్నతవిద్యను అభ్యసించిన వారు మాత్రమే ఆ రకమయిన వుద్యోగాలకు అర్హులన్నమాట ఏదయినా ఒక వుద్యోగం మనం వాంఛిస్తున్నప్పుడు దానికి సంబంధించిన వివరాలన్నీ మనకు తెలిసివుండాలి. అంతేకాక ఆ బాధ్యత అంటే విధి సక్రమంగా నిర్వర్తించగలిగి వుండాలి. కనక ప్రతివ్యక్తి తన విద్యార్హతలను బట్టి వుద్యోగం సంపాదించుకోగల హక్కు.

తరువాత ఓటింగు: అందరం మనుషులమేకదా మాకూ పాలకులను అంటే ప్రజాప్రతినిధులను ఎన్నుకోగల అధికారము వున్నదని మీరంతా అంటే పిల్లలు అన్నారనుకోండి. కుదరదు దానినే "మైనారిటీ" అంటే పద్దెనిమిది సంవత్సరాలు నిండాలన్నమాట, అప్పటివరకూ నీకు ఓటింగుహక్కు వుండదు. ఇదే వయసుగల యువతీ యువకులందరూ ఓటింగు చేయటానికి ఓటుద్వారా తమ నిర్ణయాలు తెలియపరచుకొనే హక్కువుంటుంది దీనినే మనం ఓటింగు హక్కు అంటున్నాం"

"మిగిలింది ఏమనుకున్నాంరా ప్రసాదూ?"

"విజ్ఞప్తిహక్కు మాస్టారూ"

"అది మూడవది విజ్ఞప్తిహక్కు అంటే ఏమిటి? ప్రతి పౌరుడూ తనకు సాంఘికంగా జరిగే దురన్యాయాలను నీ అవుసరాలుగానీ ప్రభుత్వంతో సంప్రదించుకొని లాభము పొందగలందులకు జరిపేవిధానం విజ్ఞప్తిలేక విజ్ఞాపనఅంటాం ఈ హక్కుగూడా కులమతాలతో పనిలేకుండా ప్రతిపౌరునకు వుంటుంది, నీకు నీ ప్రభుత్వం మరిన్నిరకాల హక్కులిచ్చింది నువ్వు ఈ హక్కులన్ని ఎప్పుడు పొందగలుగుతావు?"

"మన విధులను మనం సక్రమంగా నిర్వర్తించినప్పుడండి" విద్యార్థులంతా సమాధానం చెప్పారు.

"బాగా చెప్పారురా అది ఎవరి విధివారు సక్రమంగా నిర్వర్తించినప్పుడే హక్కు పొందగలుగుతారు. ఇప్పుడు నా తండ్రికి ఒక వందఎకరాల పొలము వుందనుకుందాం, నిజాని తరువాత ఆ ఆస్తిపొందే హక్కెవరిదీ? నాదే కాని

నేను వ్యసనపరుడన్నాయి దుబారాచేస్తూ జులాయిలా తిరుగుళ్ళు తిరిగి అపకీర్తి పాలయ్యాననుకో నా తండ్రి ఆ ఆస్తి నాకు దక్కనిస్తాడా దక్కనియ్యడు ఎందువల్ల ?"

"పాడుచేస్తారని భయం" సమాధానం చెప్పారుపిల్లలు,

"అట్లాగే ఏ హక్కయినా దాన్ని మనం గౌరవించిమన ధర ం మనం ఆచరిస్తేనే మనల్ని అది ఆదరించి గౌరవిం చేది అర్థమయిందా?"

ఎవరి విధులను వారు సక్రమంగా నిర్వర్తిస్తుంటేనే పరి పాలనా యంత్రాంగం సాఫీగాసాగి, దేశం సుస్థిరత్వంతోనూ, శాంతియుతంగానూ వుండగలిగేది. అప్పుడప్పుడు విదే యులు యుద్ధాలకు తలబడుతూ వుంటారు. దీన్ని మనం రాజ్యకాంక్ష అంటాము, తన రాజ్యం తనకు చాలక పొరుగు దేశాలలోవుండే సిరిసంపదలనుచూసి కన్నుకుట్టి ఆ దేశపు వనరులనూ సౌభాగ్యాన్ని సొంతం చేసుకోవాలని చూస్తుంటా రిలాంటివాళ్ళు. వీరికి తమకంటే బలహీనమయిన దేశాలు కని పించినప్పుడు వాటిమీద కయ్యానికి కాలుదువ్వుతూ యుద్ధాలు ప్రకటించి విజయం పొందడమో లేక జననష్టం కలిగించడం లాంటి పనులు చేస్తూ వుంటారు. అలాంటి సమయాలలో ఎవరి దేశాన్ని వారు రక్షించుకోవలసిన ధర్మము ప్రతి పౌరునికి వుంటుంది, నలుగురు కలసి ఐకమత్యంతో యుద్ధంచేస్తే శత్రువు ఎంతటి బలవంతుడయినా ఓలవంచక తప్పదు. మన కెందుకులే అని ఎవరికివారు మౌనంగానే వుంటే సులభముగా

శతృవుకు ఎంత పెద్దదేశమయినా లొంగిపోవటము ఖాయమన్నమాట, సైన్యం ప్రతిదేశంలోనూ వుంటుంది అయినా స్వచ్ఛందంగా ప్రతిపౌరుడూ అవసరమయితే యుద్ధములో పాల్గొని శత్రువులను ఎదిరించే విధానాలు తెలుసుకుని వుండటమే దేశానికి మనకు కూడా రక్షణచర్య అవుతుందన్నమాట.

ఆ విధంగా కాకుండా దేశాన్ని రక్షించవలసిన భారము కేవలము సైనికులదే అనుకుంటే మనలో బలము సన్నగిల్లి నట్లేగదా? అందుకే మనకు "ఆర్. యస్. యస్". అని, "హోమ్‌గార్డ్సు" అని ఇలాంటి స్వయం సేవక సంఘాలు న్నాయి ఇందులో ప్రతిపౌరుడూ చేరవచ్చు ఉత్సాహముగా యుద్ధ విధానాలన్నీ తెలుసుకోవచ్చునన్నమాట ఏ శత్రువయినా ఒంటరిగా ఉన్న వాడిమీదకు వచ్చినంత వేగముగా ఐకమత్యమూ సంఘటిత శక్తిగల వారిపైకి రాగలరేమో చూడండి కారణం ఏకత్వాన్ని చూసి భయం.

గడ్డిపరకను సి మీ చేతికిస్తే చాలా చులకనగా భావించి పుటుక్కున తెంపగలరు కానీ ఓ వంద గడ్డిపరకలు కలిపిన వాటిని తెంపగలరా లేదు కారణము ఏమిటి వాటి కలయిక వాటికాశక్తి నిస్తుందన్నమాట అందువలన అవసరమయినప్పుడు ప్రతిపౌరుడూ తన ప్రాణాలను కూడా ఇచ్చి దేశాన్ని గౌరవాన్ని రక్షించుకోవాలి లేదా తిరిగివారు దేశాన్ని ఆక్రమించేవరకూ ఉపేక్షిస్తూ కూర్చుంటే బానిసత్వం తప్పదన్నమాట. భారతదేశము ఒకప్పుడు శ్వేతజాతి పాలనలో ఎంత బానిసత్వాన్ని అనుభవించింది మనం గాలి పీల్చుకుంటూ మనభూమి మన పండించుకుంటూ మన సంపదలను మనము

అనుభవించలేక వారికి కప్పము గడుతూ వారికి దాసానుదాసులుగా గడిపారు. వినటానికి, మాట్లాడటాని , చివరకు జీవించే స్వేచ్ఛకూడా లేని మెచ్చ ప్రభుత్వంలో నరకము అనుభవించింది.

అలాంటప్పుడే మహానాయకులు ప్రాణాలకు సైతము తెగించి నడుముకట్టి జాతిని ఉత్తేజితుల్ని చేసి ముందుకు నడిపించారు ఎందరో మరణించారు. ఇంకెందరో కాల్చి చంపబడ్డారు, కొందరు కారాగారాలలో మ్రగ్గిపోయారు. అయినా వీరు ముందంజ మానకపోవటంవలన వీరి తిరుగులేని దీక్షవలన తెల్లజాతివారు మనదేశము విడిచి పారిపోక తప్పలేదు దీనికంతటికి మరేమిలేదు దోపిడీ విధానం స్వార్థమే దీనికి కారణం మనం అక్కడక్కడా కొన్ని గ్రామాలమీదకు బందిపోటులు విరుచుకుపడి మానభంగాలు చేయడం లాంటి సంఘటనలకు కారణమేమిటి? ఆ గ్రామస్థులలో ఐకమత్యం లేకపోవటమే అందరూ ఒక్కత్రాటిపై నిలిస్తే ఏ శక్తి వీరిని ఎదిరించలేదు. గ్రామరక్షణ ఎంత అవసరమో వ్యక్తి స్వేచ్ఛ స్వాతంత్ర్యాలకు దేశ రక్షణ కూడా అంతే అవసరము.

ప్రతిదేశమూ పౌరుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసము మరెన్నో హక్కులు మనకు సమకూరుస్తుంది. అదే విధంగా కేవలం ప్రజాక్షేమం శాంతిభద్రతలను దృష్టిలో పెట్టుకుని శాసనాలు కూడా విధిస్తుంది.

అయితే ఈ శాసనాలను చూసి చాలామంది ప్రభుత్వం తమ స్వేచ్ఛను అరికట్టాలని చూస్తోందని భావిస్తారు. ఆ భావన పొరపాటు తప్పు. ఈ తిరుగుబాటు విధానాలూ, విప్లవాలూ

అల్లర్లూ, అరాచకాలూ ఇవన్నీ ఎక్కువగా స్వార్థశక్తులు పేరే పించే విధానాలు వీటి లోతుపాతులు తెలియని అమాయక ప్రజలు గుడ్డిగా రిని అనుసరిస్తూ అల్లర్లు ఆరంభిస్తుంటారు.

ఏ విప్లవానికయినా ఒక మూల సిద్ధాంతమువుంటుంది కాని ఆచరణ రూపంలోకి వచ్చేసరికి ఇది వెర్రితలలు ఆరంభిస్తుంది. అసలు ఆశయం మరుగున పడిపోయి అమానుషాలు ఎక్కువకావటం వీటిమూలంగా సామాన్య ప్రజల నిత్య జీవితం స్థంభించిపోవటం జరుగుతూ వుంటుంది. ప్రభుత్వ శాసనాలను అంగీకరించి, అనుసరించటంవలన సంఘంలో సుస్థిరత నెలకొంటుందో ఎదిరించి నడచినందువలన అంత అక్రమమూ అన్యాయాలూ జరుగుతాయి.

ఉదాహరణకి దొంగసారా వ్యాపారం పనికిరాదనుకోండి. కానీ ఈ శాసనం లెక్కచేయక స్వార్థపరులు ఆరోగ్యానికి హానికరమైన వస్తువులు వాడి కేవలం వారి సంపాదన కోసం అక్రమవ్యాపారం చేస్తూనే వుంటారు. అది సేవించి ఎందరో అమాయకులు ప్రాణాలు పోగొట్టుకుంటారు దీనివలన ఎంతమంది కుటుంబాలు ఎన్ని అవస్థలకు గురౌతున్నాయో వారికి తెలియదు.

ప్రతివ్యక్తి మంచివాడే. మామూలుగావుంటే న్యాయాన్యాయాలను ఆలోచించే జ్ఞానం అవకాశం వుంటుంది. త్రాగితే రాక్షసుడౌతాడు. విచక్షణాజ్ఞానం కోల్పోయి ప్రవర్తించడం జరుగుతుంటుంది.

అపరాధం జరిగిపోయి ఆ మత్తుదిగి ఆలోచించి బాధపడ

తాడు. ఐతే అప్పటికే అతని అపరాధంవలన అవకాశం చేజారిపోతుంది. శిక్ష తప్పదు.

అలాగే తిరుగుబాట్లు లేని విప్లవాల సందర్భంగా శాసనాలు ధిక్కరించి ప్రాణాలు పోగొట్టుకున్న వారెందరో వున్నారు శాసనం అనేది ఒక విధంగా మనకు రక్షణ అని మనం ఆలోచించం. ఇతరులను నిందించకు అని చెపుతుంటాం నా ఇష్టం అనే వారిని చట్టం క్షమించదు.

ఏ శాసనమైనా, ఏ చట్టమైనా వ్యక్తిలేక, సంఘ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని అమలు జరుపబడిందేనన్న నిజం ప్రతి పౌరుడూ గుర్తుంచుకొని మెలగడం ప్రజాస్వామ్యానికి చాలా మంచిదన్నమాట. ఉద్యమాలూ, విప్లవాలూ ఆచరించుచున్నప్పుడు అసలు స్వరూప స్వభావాలను అర్థం చేసుకొని శాంతియుతంగ ఉద్యమం సాగించడంమంచిది. వుద్యమం తప్పుకాదు. దాని స్వభావం మారకూడదు. ముఖ్యంగా ఉద్యమకారులు స్వార్థపరులూ కాకూడదు. స్వార్థశక్తులను దరిచేరనీయకూడదు.

ఎదుటివ్యక్తి శ్రేయస్సుతో ఉద్యమము లేవదీసేటప్పుడు ఆవేశాలకు, ఆగ్రహాలకు తావులేకుండా శాసనధిక్కారం లేకుండా వ్యక్తిగతంగ తనకుగల హక్కుల పరిరక్షణకోసం శాంతియుత పోరాటం తప్పుకాదు. మనది అన్న అభిప్రాయం రచి బస్సులూ, స్టేషనులు తగలబెడుతూ, ప్రభుత్వం అంటే

అదొక ప్రత్యేక వ్యవస్థ అన్న అ ప్రాయంతో ప్రజలసొమ్ము ప్రజలే నాశనం చేసుకోవడమంటే తమ హక్కులు తాము కోలుపోవటమే గదా ఇన్ని మాటలెందుకు విద్యార్థులూ విధిని మరచిపోయిన పౌరునకు హక్కు వుండదు.

దానికి కారణము ప్రవర్తన, సత్ప్రవర్తన మంచి ఫలితాన్నిస్తుంది. దుష్ప్రవర్తన వ్యక్తిని దుర్మార్గుడిగా మార్చటమే కాకుండా, వున్న స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అరికట్టిఅవస్థలపాలు చేస్తుంది. కనుక నీ క్షేమాన్ని కోరి ఏర్పరచిన ప్రభుత్వ శాసనాలను ఉల్లంఘించడము విధికాదు"

నరసింహంగారు విషయాలన్ని కథలాగా చెప్పు పోతుంటే విద్యార్థులే కాకుండా వయోజనులంతా గూడాఎంత శ్రద్ధగావింటూ మాష్టారికి ఇన్ని విషయాలు ఎట్లా తెలుసా అం ఆలోచించడము పారంభించారు. వారందరి ఆ క్షణముల్ అర్థముకాసాగింది ఏమైనా విద్యావంతుడు విద్యావంతుడే చదువులేనిదే లోకజ్ఞానము అలవడదు మంచికయినా చెడకయినా అసలు ఒక ఆలోచన అంటూ రావాలంటే మనిషి చదువు చాలా అవసరము.

తాము ఎంత కష్టపడి సంపాదించినా, ఏది మంచో ఏది చెడో తమకు తెలియదు. తాము ప్రతి పనికి ఒకరిపైన ఆధారపడవలసిందే వారము ఒకర్ని అడగాలి, వర్జము మరొకర్ని అడగాలి. అసలు దేశమూ, కాలమాన పరిస్థితులూ ఎక్కడ ఏ మార్పులు జరుగుతున్నాయ్. సాంఘిక, ఆర్థిక రాజ య పరమైన మార్పులు దేశములో ఏ విధముగా జరుగుతున్నాయో తమకు తెలియదు. ఇంతెందుకు తమకు డబ్బు అవసరముయితే

పొ...వి... )

నోటు వ్రాయించుకున్నవాడు దానిలో ఏమి రాశాడో తమకు
తెలియదు.

చివరకు సంతకము కూడా చేతకాక వేలిముద్రతో వారు
చేసే అన్యాయాలన్నీ నోరుమూసుకుని అనుభవించి రవల
సిందే వందరూపాయలు అప్పిచ్చి దానికి అక్రమమైన వడ్డీ
గుంజుతూ, తరతరాలు ఆ అప్పు రలేదంటూ వెట్టిచా రి
చేయించుకున్నఆసాములు వాకిళ్ళలోశరీరాలము కుని వించ
డము ఎంతబాధ? ఇవన్నీ ఎందువల్ల తాము చదువుకోకపోవ
డము వల్ల అలాంటి అవకాశాలు లేకపోవడము వల్ల ఒకవేళ
అవకాశం ఉన్నా శ్రద్ధలేని అజ్ఞానంవల్ల బ్రతుకంతా చీకటిలో
గడచిపోవడము ఒక్కక్షణములో అక్కడ చేరిన వయోజను
లకు కలిగిన ఆలోచనలు.

నరసింహం పంతులుగారు వారిఆలోచనలు ఆ వెన్నెల్లో
పసిగట్టినట్లుంది. ప్రభుత్వం చదువుకోవాలని కుతూహలంగా
వున్న వయోజనులకు కూడా ఇప్పుడు రాత్రి సమయాలలో
చదువుకొనే అవకాశాలు కల్పిస్తోంది. ఒక్కమాటలో చెప్పా
లంటే జాతి బలహీనతకు కారణం నిరక్షరాస్యత అజ్ఞానములో
వున్న కుటుంబాలు గతచరితలో హింసలు అనుభవించివారి
చరా న్ని,రక్తాన్ని స్వార్థపరులకుఅంకితము చేశారో చెప్పనలవి
కాదు.

అందులో విద్యావిహీనులు ఎన్ని అక్రమాలు చేసి ఎంత
ధనము సంపాదించినా, అది అతడ్ని అంటిపెట్టుకొని వుంటుం
దని చెప్పలేము. ఏ దొంగలో కొల్లగొట్టవచ్చు. కానీ విదా వం
తుడు యే ప్రదేశము వెళ్ళినా గౌరవింపబడతాడు. అదిఇతరులు

దొంగిలించాలంటే దొరికే ధనముకాదు. విద్యావంతుడు ఏ ప్రాంతానికి వెళ్ళినా వించగలడు ఎందువలన? తను గడించిన విజ్ఞానంవల్ల అంతేకాని, ధనవంతుడు దరి దుడుగా మారి ఒకప్పుడు నేను గొప్ప ధనవంతుణ్ణి అని చెపితే ఎవరూ గౌరవించరు. ఎందువలననగా అతడు మూర్ఖుడు గనుక.

విద్యావంతులు యెన్నో ఉద్యోగాలు చేస్తున్నారు. వ్యాపారాలు చేస్తున్నారు. ప్రజాసేవ పరమావధిగా పెట్టుకున్న వారు ఎన్నికలలో నిలబడి నాయకులై దేశసేవ చేస్తున్నారు. విద్యాధికులు ఎందరో ప్రపంచ ప్రసిద్ధమైన వ్యక్తులుగా పరిగణింపబడ్డారు చరిత్రలో చరిత్ర ప్రసిద్ధులుగా మిగిలిపోయారు. వినయమూ, విధేయతా, బాధ్యత, హక్కు సంఘ నైసర్గి స్వరూపము ఏది అర్ధము చేసుకుని సక్రమజాతి విత విధనము అవలంబించాలన్నా విద్య ముఖ్యము.

విద్య మనిషికి జ్ఞాననేత్రం అదే లేనప్పుడు ఎంతమంచి కంటిచూపు కలిగివున్నా ఆత్మ పరి లనకు అసలు అవకాశము లేదు, జ్ఞానము అనంతమయింది. విషయ పరిశీలనకు చరిత్రను అవగతము చేసుకునేందుకు మనిషి జీవితము చాలదు. అలాంటిది ఉన్న జీవితకాలము అమాయకంగానూ, అజ్ఞానాంధకారముతోనూ గడిపి ఏమిటి సుఖము. ఇంక ఈ పూటకు ఆపు చేద్దాం నేనీపూట చెప్పిన విషయాలు ఈ రాత్రికి జాగ్రత్తగా చెప్పాలి ఆ తరువాత మళ్ళా తిరిగి బోధన ప్రారంభిస్తాను అంటూ ఒక్కసారి విశ్రాంతిగా గాలి పీల్చుకున్నారు నరసింహముగారు.

“వెళదాములెండి మాష్టారూ మీరి విషయాలన్నీ చెబుతుంటే ఇక్కడనుండి కదలాలనిపించటములేదు ఒరేయ్ అబ్బాయిలూ మీరంతా వెళ్ళి చదువుకోండిరా?” అంటూ విద్యార్థుల్ని పంపించారు ధర య్యగారు.

తర్వాత చాలాసేపు ఇతర విషయాలూ, రాజకీయ ఆర్థిక పరిస్థితులూ వారందరికీ చెప్పారు, నరసింహముగారంటేచాలా మంచి అ పాయము ప్రచారమయింది, పాలు, కూరగాయలు మజ్జిగ, అపరాలు, వొకటేమిటి రోజుకొకరు చొప్పున నరసింహము పంతులుగారికి పంపనారం ంచారు.

నరసింహము పంతులుగారికి నలుగురూ కలిసి పంపడంతో వారికి, వారి భార్యకు కావలసినదానికంటే, వస్తువులు అధికముగారావటముతో వారికి సరిపడినంత వుంచుకుని మిగతావి పక్కనున్న దకుటుంబాల వారికి పంపి చేస్తుం ది ఆయన భార్య పగలంతా ఆయనకు వేరే ఏపనీ లేదు ఊరివారి ప్రేమానురాగాలవల్ల నరసింహంగారు దేనికీ వెతుక్కోవలసిన పని కాని ఆలోచించవలసిన అవసరము కానీ లేదు.

అందువల్ల రాత్రి సమయాలలో విద్యార్థులకు బోధించవలసిన విషయాలను గురించి ఆలోచిస్తూ గడుపుతుండేవారు ఆ రాత్రికి తిరిగి అందరిని పౌరవిధులను గురించి కొన్ని ప్రశ్నలు వేసి తిరిగి చెప్పనారం ంచారు.

“ఇప్పుడు మనము పన్నులను గురించి తెలుసుకుందాం ఏదీ ప్రజాస్వామ్యమూ ప్రజలు సక్రమంగా ఏర్పరచుకున్న

ప్రభుత్వమే ఐనా ప్రభుత్వ కార్యాలయాలు, యంత్రాంగము అంతా సక్రమముగా నిర్వహించాలంటే ప్రభుత్వానికి ధనము అవసరముగదా? అందుకు అనేకరకాల పన్నులు వసూలు చేస్తుందన్నమాట ప్రభుత్వం. దీన్నే శిస్తు అనికూడా అంటాం మనం. భూమిపన్ను, అనేకరకాల పన్నులు వసూలు చేస్తూ వుంటుందన్నమాట.

మన సంఘంలో చాలామంది కోటీశ్వరులూ, అక్రమ వ్యాపార సంస్థలూ ఈ పన్నుల ఎగవేత కార్యక్రమముచేస్తూ వుంటారు. పరిపాలన సక్రమముగా నిర్వహింపబడి శాంతి సుస్థిరతలు నెలకొల్పబడాలంటే ఈ పన్నులు ప్రతిపౌరుడూ సక్రమముగా చెల్లించవలసిన బాధ్యత మనందరి వుంది. ఆదాయం సరిగా చెప్పకపోవడము, పన్నులు ఎగవేయటం వంటివి ప్రభుత్వ విధానానికి మంచిదికాదు.

ఎన్నికలు, ఓట్లను గురించి మనం తెలుసుకుందాం. ముఖ్యముగా ఈ ఓటుమీదనే దేశక్షేమం ఆధారపడివుంటుంది. నిజాయి పరుడూ, దేశభక్తుడూ, ప్రజాశ్రేయో లాషికిమాత్రమే అతని శక్తి సామర్థ్యాలూ తెలుసుకుని ఓటు చేయడము మంచిది.

ప్రభుత్వ యంత్రాంగంలో దగాకోరులు స్వార్థపరులు చేరితే ప్రజలు మోసగించబడి పీడింపబడటము అశాంతి, తిరుగు బాట్లు అంతర్యుద్ధాలు అనివార్యం అన్నమాట. ఈ అనై

క్యతా రాజకీయ పరిస్థితులు అర్థము చేసుకున్న శక్తివంతమైన పౌరుగు రాజ్యాలు వెన్నుపోటు పొడిచే అవకాశాలు తద్వారా బానిసత్వం తప్పవు.

ఈ విధమైన స్వార్థపరులు సగటు మనిషికి ధనము ఆశ జూపించి ఓట్లు కొంటారు. తనింట్లో ఆరు ఓట్లుంటాయి. ఓటు పదికో పరకో అమ్ముకొంటే కొంత ధనంవస్తుంది. దాంతో రెండురోజులు తాగి తందనాలాడొచ్చు అనుకొని ఓటు విలువ తెలియక అలవాట్లకు బానిసలయినవారు ఓటును దుర్వినియోగం చేస్తుంటారు. ఒకనాటి తన అలవాటు తన లాంటి వారి వితాలమీద గొడ్డలిపెట్టవుతుందని ఆ అమాయ కుని తెలియదు.

అలాంటివ్యక్తి నాయకుడయినా నీ హక్కుకు న్యాయం జరగదు. ఒకవేళ అప్పుడు న్యాయం అడిగినా నేనుఖర్చుపెట్టి ఓట్లుకొని డబ్బు సంపాదించుకోవద్దా అందుకే లంచాలు అవ సరమంటారు, మరికొందరు బెదిరించో, దౌర్జన్యము చేసో ఓట్లు వేయించుకుంటారు. ఎందువలన ఓటు విలువ ఓటు విష యంలో మాత్రం ఎటువంటి రా పౌరునికి పనికిరాదన్న మాట.

అన్యాయాలు, అక్రమాలూ జరుగుతున్నప్పుడు చట్టి త్యా నేరములనబడే విషయాలు జరుగుచున్నప్పుడూ వాటిని ప్రభుత్వ దృష్టికితెచ్చి ఆ అన్యాయ విధానాలను అరికట్టేటట్లు చూడాలి. జూదం ఆడుతున్నారనుకోండి ఆగి చూసి మనకెందుకులే మన విషయం కాదని సరిపెట్టుకో కూడదు రేపు నీ కుమారుడే ఆ జూదరులలో ఒకడు కావచ్చు

అలాగే నేరాలు, అన్యాయంగా ఒకరిపై మరొకరు దెబ్బ లాడటమో, హత్యలు చేయడమో దౌర్జన్యాలు జరపటమో స్తున్నప్పుడు నిర్భయంగా నువ్వుచూసిన విషయముసాక్ష్యం చెప్పడం నీ విధి. వాడేదో చేస్తాడనో మనకెందుకనో నీవు మౌనంగా వుండటంవలన అవినీతి పెచ్చుపెరిగిపోతుంది. వారు నిర్భయులై సంచరించుటవలు చివరకు ఏదో ఒకనాటికి నీకూ అదేస్థితి రావడం తప్పదన్నమాట. కనుక అవినీతి, అక్రమము ఎక్కడ జరుగుతున్నా నీవు నిర్భయంగాఖండించ టమో, లేక ప్రభుత్వదృష్టికి తేవటమో తప్పనిసరిగాచేయాలి.

ప్రతివాడూ కష్టించి సంపాదించటం, శ్రమ విగా మార టము అలవరచుకోవాలి. సోమరితనం వితంమీద తిరుగులేని దెబ్బతీస్తుంది శ్రద్ధగా వినండి. నాకు కొంతఆస్తి వుందను కోండి. ఇంకా కష్టించి దానిని పెంపొందించడం వలన అది పెరుగుతుంది. దాంతో కొన్ని సత్కార్యాలు చేయగలను. నా వారిని పోషించగలను కానీ సోమరిపోతు నయ్యాననుకోండి అవసరం అలవాట్లు ఎక్కువయి వున్న ఆస్తికాస్తా హరించుకు పోతుంది. కష్టపడటం చేతకాదు కనక అబద్దాలు చెప్పటం, మోసాలు చేయటం సంపాదించటం ఆరం స్తారు. అవీ కుద రకపోతే అఘాయిత్యాలూ, హత్యలూ ఆరం స్తారు అవసరం ఎంతపనయినా చేయిస్తుంది అర్థమయిందా సోమరితనంవెనుక ఎన్ని దుష్ఫలితాలు వున్నాయో

సంఘంలో మీరు ఎక్కడయినాచూడండి సోమరిపోతులు

ఈ విధముగా అక్రమసంపాదన సాగించేవారే అందుకే
మనిషి నిష్కపటి, శ్రమ పి కావాలి. అప్పుడే దేశంను శ
సస్యశ్యామలమవుతుంది. రైతున్నాడనుకోండి. అతడు అ
రా తులు కష్టపడితేనేగదా పొలం బంగారుపంట పం
సోమరిపోతులు దేశానికి గొడ్డలిపెట్టు ఒకవిధముగా చీడ
గులు. శ్రమజీవులు దేశాధినేతలు సోమరులూ, విలాస
షులూ వున్న దేశం అధోగతి పాలవుతుంది. గానీ అభు
యము సాధించలేదు. కనుక చూశారా ప్రతిమనిషి ఇది
హక్కు అని గుండె బాదుకోవడమేకాదు. ఇదీ బాధ్యత
తనధర్మము తాను సక్రమముగానిర్వర్తిస్తే రామరాజ్యస్థా
నిశ్చయం.

అం హక్కూ, విధి పరస్పర సహకారంలాంటివ
మాట. ఈ రెంటిలో ఏది దూరమయినా ఒక మనిషికే క
మొత్తం జాతికి తిరిగి బానిసత్వము, చీకటి బతుకు తప
మనకందరికి ఎన్ని హక్కులున్నాయో అన్నివిధు
వున్నాయి. నేను ఉపాధ్యాయుడ్ని గనుక మీరు నన్ను
వించి పూజించాలి.

మీరు నన్ను గౌరవించి ఆదరిస్తున్నారు గనుక
మీకు చక్కగా విద్యాభ్యాసము చేయించాలి అబ్బాయి
తెలిసిందిగదా పౌరుడంటే ఏమిటో? పౌరునికుండే హక్కు
విధులు అంటే ఏమిటో? ఇంక ఈ రోజుకి చాలిద్దాము.
"ప్రెసిడెంటుగారు కొంతసేపు చెరువుకట్టకు వెళ్ళి చల్లని
పీల్చుకొందాం" అంటూ లేచారు నరసింహముగారు.

—o—